# నాకవనము



'విద్వాన్, కవిచంద్ర'

మేడిపల్లి లక్ష్మీకాంతము

# తొలి నుడి

డాక్టరు దివాకర్ల వేంకటావధాని,
M. A. (Hons.) Ph. D.,
ఉస్మానియా యూనివర్సిటీ.

శ్రీ కవిచంద్ర మేడిపల్లి లక్ష్మీకాంతంగారు జనాబాయి మున్నగు నాటకములచేతను, విద్యార్థి జనోపయోగ్యము లగు పలు విధములైన రచనలచేతను ఇదివరకే ఆంధ్రదేశమునకు సుపరిచితులు. వారు తా మప్పుడప్పుడు రచించిన పద్యరత్నముల నేర్చి యీ 'నా కవనము' ను గూర్చినారు. మందార పారిజాతాది వివిధ పాదప లతా శోభితమైన నాకవనమువలెనే యీ నా కవనము వివిధ వస్తు సంబంధులైన కావ్యరత్నములతో శోభిల్లుచు నింపు గొల్పుచున్నది. ఇందలి కావ్యము లన్నియు శృంగారరస ప్రధానములు. కవిగారి కా రసమునెడ నభినివేశము

తలఁచునది, చూచునది, నోటఁ బలుకునదియు
ఒక్క శృంగారమే దాన నోలలాడి
సత్య సౌందర్యరూపంబు చాటుచుందు
తన్మయతఁ జెంది చిన్ముద్ర దాల్చుచుందు

అను పద్యమువలన వెల్లడి యగుచున్నది. అట్లని వా రెచ్చటను

సభ్యతౌచిత్య మర్యాద నతిక్రమించియుండలేదు. కావ్యము లన్నియు లలిత గంభీర భావ బంధురములును సహృదయ హృదయానంద సంధాయకములు నై యలరారుచున్నవి. వర్ణనలు సహజ రమణీయములై కవిగారి ప్రకృతి పరిశీలన పాటవమును బ్రదర్శించుచున్నవి. వసంతము, గులాబి, బిచ్చగత్తె, తుమ్మెద కబురు మున్నగు కావ్యము లిందులకుఁ దార్కాణములు.

కవిగారి భాష మృదుమధురమును, నిర్దుష్టమును, జాతీయము నై యొప్పుచున్నది. ఇందలి పద్యములు పెక్కు గీతములు, సీసములు. తుమ్మెద కబురులో మందాక్రాంత మొకటి యున్నది. రెండు మాటలలో మొదటి మాట కవిగారి యాత్మవిశ్వాసమును జాటు నుత్పలమాల. ప్రళయము గేయము. కవిగారి రచన యే ఛందస్సునైన నెక్కడను గుంటువడక ధారాళముగా సాగిపోయినది. వారి సీసము లెడనెడ శబ్దాలంకార పూరితములై ప్రబంధము లందలి సీసములను దలపించుచున్నవి.

సుప్రసిద్ధ కవిశేఖరులును, రసజ్ఞవతంసులును నైన శ్రీ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రిగారి హృదయమును ఆదరమును ఆకర్షింపఁజాలుటయే యీ కావ్యకన్య యాభిజాత్యమును సూచించుచున్నది. అది ఆమె యదృష్టమేకాక తండ్రిగారి యదృష్టము కూడను. ఏలయన వన్నెమీఱు నీ కన్నెమూలమున వా రనన్య సులభులైన యా కవిశేఖరుల నల్లునిగాఁ జేసికొనఁగల్గినారు.

# అభిప్రాయము

కవి రసస్నాత; కావ్యము రసధుని. కైశికీవృత్తిలో, కదళీ ద్రాక్షా పాకములలో వెలసిన యీ మధుర కావ్యము రసికులకు కేళాకూళి; లాక్షణికులకు రమ్యాలోకము.

పద్యము లన్నియు సానలఁదీరిన జాతి రత్నములే. ప్రబంధ సామగ్రి యీ చిన్ని కావ్యములో గ్రిక్కిరిసియున్నది. రసభావముల కనువైన పదజాల మీ కవికిఁ దనంత దొర్లుకొని వచ్చును. లక్షణ యుక్తమైన కవిత్వము, అనర్గళధార, భావనా సామర్థ్యము ప్రతిభా వ్యుత్పత్తులకు నిదర్శనము. నా కవనములో శృంగారమే మనోహర దృశ్యము. అయినను భక్తి శృంగార వైరాగ్య భావములు వీరి చేతి సొమ్ములు. ఇందలి ఉపమలు సహజములు; ఉత్ప్రేక్షలు కవి సమయ సిద్ధములు. ఇది యొక శృంగార రసగుళిక. భక్తిభావమునకు వీరి జనాబాయి నాటకము చదివితీరవలసినదే, 'చర్మభస్త్రి కాదో, సుధాసరసి యేమొ' అని వైరాగ్యము ప్రదర్శించిరి. 'ద్వైత మద్వైతమైనట్లు; ప్రకృతి పురుషు లిర్వురును నిత్యమన్నట్లు, ఏకమేవాద్వితీయ' మ్మను పదములు వేదాంత స్ఫురణములు. స్వైరిణీసంగతిని గోరు విటుఁడు జడుఁ డనుట నీతిసూక్తియే. అసూర్యంపశ్యలకు జరిగిన యన్యాయ మును చల్లని వెన్నెలలో బట్టబయ లొనర్చిరి.

గంగా యమునా స్రవంతులవలె అచ్చిక సంస్కృత కవితా స్రవంతు లీ 'నా కవనము' లోఁ బ్రవహించుటచే 'మ్రోడు తలఁపులు తియ్యని మొగ్గ దొడిగె' నని విశ్వసించుచున్నాను. 'కడిమి పూచె, నట్టువపిట్ట గజ్జె కట్టె'. కనుక భగవంతుఁడు నా కిట్టి సదవకాశము కల్గించినందులకు 'కృతికర్తను, కృతిభర్తను' నభినందించు నా ప్రస్తావన నింతటితో విరమించుచున్నాను.

అమరవాది వేంకటశాస్త్రి
(శోభనాద్రి పురము)

# మనవి

నా కవన మొక కవితోద్యానము. మా కవితా కన్య యీ నా కవన ప్రసూనమాలను శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి మెడలో వైచి వరించినది. షష్టిపూర్తియైన కవివరుని మా కవితాకన్య యెట్లలరించునో నే నెఱుగను. అయినను 'భక్తిగలుగు కూడు పట్టెడు చాలదా?' అను భావము తోడనే శ్రీవారి చిఱుకబ్బమును చేరఁదీసిరని నమ్ము చున్నాను. దీనికిఁ దోడ్పడిన సాహితీ బంధువులకు, మిత్రులకు నమస్కారము లర్పించుచున్నాను.

దయతో తొలి నుడి వ్రాసి యిచ్చిన ఆచార్య శ్రీ దివాకర్ల వేంకటావధానిగారికిని, అభిప్రాయ మొసగిన శ్రీ అమరవాది వేంకటశాస్త్రిగారికిని మత్కృతజ్ఞతాభి వందనము లర్పించుకొనుచున్నాను.

ఇట్లు
సుధీజన విధేయుడు.
గ్రంథకర్త

# కృతిసమర్పణము

నవరత్నములజాలు నవఘుళింపఁగఁజాలు
స్మేరాననము యశశ్శ్రీ వెలుంగ
కమలినీ హస్తాగ్ర గళిత సంతత దాన
ధారల లేమి నిద్రాణమొంద
కరుణాకటాక్ష వీక్షణకంజ పుంజంబు
శ్రితపాళి కమృతాభిషేక మొదవ
రాగాధరస్పంద రాగోక్తి చందన
స్ఫురణంబు విబుధప్రపూజ కాఁగ
సద్గుణుండు వేంకటకృష్ణశాస్త్రి సుతుఁడు
కీర్తిశాలి దేవులపల్లి కృష్ణశాస్త్రి
వెలయు నీ కావ్యరమణికి వలపుగూర్చు
వల్లభుఁడయి శుభ్రజ్యోత్స్న వసుధ వెలుఁగ!

# కవితాప్రశంస

చదలేటి పొందమ్మి హృదినంటి వీతెంచు
    నెత్తావి చికురంబు లొత్తుచుండ
హంసతూలికలపై నలరు మొగ్గలసెజ్జ
    సురకన్య పచరించి జోలపాడ
మందార మకరంద మాధుర్యమును వాణి
    కెంగేల రసన నాకించుచుండ
నెలవంక వెన్నెల నేసిన వలిపంబు
    శృంగారముగ ధాత్రి చేర్చిదిద్ద
క్రొమ్మెఱుంగులు, హంసలు, కోకిలములు,
నిర్ఝరులు, వేణునాదముల్ నేస్తమొంద
నుల్లసిల్లు నీ కవితామతల్లి కృష్ణ
శాస్త్రి దేవులపల్లి వంశాబ్ధి చంద్ర!

# నా కవనము

మృదుల కూజితముల మిగుల మోదముగూర్చు
నాకవనముసుమ్ము నా కవనము
రాయంచనడల విరాజిల్లు స్వర్ణదీ
నాకవనముసుమ్ము నా కవనము
కేవల శృంగార కేళీ విహారంబు
నాకవనముసుమ్ము నా కవనము
బహువర్ణనౌచిత్య పాటవంబున కిక్క
నాకవనముసుమ్ము నా కవనము
సరసరీతి గుణ రసాలంకరణ వృత్తి
నాకవనముసుమ్ము నా కవనము
వాగ్విధాతృ శేష వాచస్పతులు చొక్క
నాకవనముసుమ్ము నా కవనము.

తలఁచునది, చూచునది, నోటఁ బలుకునదియు
ఒక్క శృంగారమే ; దాన నోలలాడి
సత్య సౌందర్య రూపంబు చాటుచుందు
తన్మయతఁ జెంది చిన్ముద్ర దాల్చి చుందు.

# తొలివసంతము

రుచ్య ఫలభార నమ్ర తరువులు, ఖచర
దంపతీక్రీడ లెసఁగెడు దరులు గిరులు
క్రొంజిగురు మెక్కి కూయు పుంస్కోకిలములు
తేఁటి ఝుంకృతి గల సరస్తీర పంక్తి
పిల్ల తెమ్మెర పుప్పొడుల్ చల్లు విరుల
కొమ్మలు, పటీర శీకరౌఘమ్ము లొడలు
మకరికాపత్ర భంగ చుంబనతరంగ
సంతతానంద మధువు, వసంతఋతువు.

# భావోదయము

ఎల నవ్వులను రువ్వు నెలనాగ మురిపంపు
        కనుదోయి మగ మీల గరుసు సూప
చిగురాకు పగడాల జగడాలు వడి డీలు
        వడఁజేయు పనుగప్పు వలపు గుప్ప
సగమేనుగల సామి నెగఁద్రోసి యిలఁ గూలు
        దొరవిల్లు బొమకూర్పు తుడిచివేయ
మినువాఁక నెఱిదమ్ములను మెక్కు తెలిపిట్ట
        నుడు లందియలమ్రోఁత నడలి వెడల
మెఱపు కన్నెల తలదన్ను మేనిచాయ
ఇరుల పెన్నెఱిగమినుండి యీనుచుండ
కడిమి పూచె, నట్టువపిట్ట గజ్జెకట్టె
మ్రోడు తలఁపులు తియ్యని మొగ్గ దొడిగె.

# మలివసంతము

ఎలమావి కొమ్మపైఁ దలిరాకులను మెక్కి
కోకిలస్వామి తాఁ గూయఁదొడఁగ
పూల దొన్నెలలోనఁ బుష్పాసవము గ్రోలి
మధుపదంపతులు సంబరము నొంద

శృంగాగ్రమున నిల్చి చేడియ మెడగిటి
మన్మధోద్దీపన మంత్ర మూఁద
పంట పొలఁతి దిద్దు పైటకొంగో యన
క్ష్మాధరంబులు వనాంబరము గప్ప
సెలయేటి కెరటాల చిఱుపాటలకుఁ జొక్కి
పవనాంకురములు చుంబనము సేయ
కొమ్మ లొండొంటితో గుసగుసల్ పచరించి
యభిసారికలరీతి నల్లలాడ
జలజల పుష్పాక్షతలు శిరంబునఁ జల్లి
మన్మధార్చన లతామణులు సేయ
ప్రకృతి కన్యామణీ పరిణయంబున కింట
పూల తోరణములు పూచినట్లు,

ద్వైత మద్వైత మైనట్లు, ప్రకృతి పురుషు
లిర్వురును నిత్య మన్నట్లు, సర్వజగతి
"ఏకమే వాద్వితీయమ్ము" నేకిపైచి
జంటజంటగ పొలిచె వసంతవేళ.

# ప్రళయము

మసృణాధర అధరోష్ఠ పీయూష పానంబు
లవలీ పల్లవ కపోల కపోల చుంబనంబు
వికసితాబ్జ విలోచన లోచన వీక్షణంబు
ఏ క్షణంబున త్రుటిత మాక్షణమ ప్రళయంబు. ॥ఏక్ష॥

ప్రణయ కోపారుణ లోల విలోచన లీలా
కమల తాడిత వపుః పులకాంకురంబు
ప్రేమాంబు పూరావగాహన వేళా జల
క్రీడా వినోదిత పద్మాకరంబు ॥ఏ ష॥

కరకంకణక్వాణ గతి ప్రకంపిత పీన
వక్షోజ కుంకుమిత వక్షస్థలంబు
సురత శ్రమోద్గత ఘర్మ బిందుచ్ఛటా
తనులతావేల్లి తానంద సుఖంబు ॥ఏ ష॥

ఉదిత ప్రథిత మణిత పూరితకంబు
కంఠరచిత కింశుకనఖక్షతంబు
ముహుర్ముహుర్వీక్షిత కటాక్ష నిక్షేప
సంపాది తైశ్వర్య ప్రఫుల్ల వదనంబు ॥ఏష॥

అరమోడ్పు నిడుద వాల్గన్నుల నెడనెడ
గలుగు ముద్దుల నొౌలుకు తమితీపి గనుట
బంతి చేమంతి నాయింతి కలువలదొంతి
కలువ రేకుల కన్నులను గప్పికొనుట ॥ఏష॥

# కన్నెగులాబి

౧

కలదు నవనవోన్మేషణములను వెలుఁగు
నొక్క కన్నెగులాబి, నేత్రోత్సవంబు
అగుట దానిపైఁ గన్ను వేయని జనుండు
లేఁడు, సౌరభం బాన కెవ్వాఁడు పోఁడు.

౨

బహుళ కంటకబాధ నావలకుఁ ద్రోసి
తమిని దనను గాఢాలింగనములఁ దేల్చు
నా సమీరకుమారుని హత్తికొనుచు
కులుకు, కవకవ నవ్వి వన్నెలను జిలుకు.

౩

భ్రమర విటుని మధుర గానరసము గ్రోలి
హృదయ మిచ్చి యమృత మాన నిచ్చి పనుచు
చికురములు దువ్వ పులుఁగులఁ జేరి చొక్కి
విభుత తనదని కాపరి విఱ్ఱవీగు.

# నళిని !

౧

భర్త చండకిరణుఁడైన భయములేక
పగలె యధరామృతం బిచ్చి భ్రమర విటుని
దనియఁ జేయుదు, "పతినన్నుఁ గనఁగలాఁడ
యోజన సహస్ర దూరమందుండి?" యనుచు.

౨

నీ కుచేష్టలు గనలేక నీటఁబడిన
నంతియే చాలునని కడు సంతసమున
దేఁటి విటకాని పొందు నా పూటఁ గందు
వెంత నేర్చిన జాణవే ! యీవు నళిని !

౩

రాజు నిను గోరినను వాని రాణు లెల్ల
చూచుచుండుటఁ గన్నెత్తి చూడ వీవు,
కుముదకాంతల జలకేళిఁ గూడియుండఁ
గుముద వగుదువు రాజుతోఁగూడఁ గాదె !

# బిచ్చగత్తె

తలకు నూనెయులేక తగ బిర్సువాఱిన
ముంగురుల్ ఫాలంబు ముద్దుగొనఁగ
దీన భావము మ్రింగి తినుచున్న మోమున
కనుల కాంతులు జీవకళలు గీయ
పిగిలిన రవికలో వెలికిఁ గన్పట్టెడి
చనుదోయి జవ్వనంబును శపింప
చినిగి చింపురులైన చీరలో డాగిన
తొడల మేలిమి కాంతి తొణకులాడ
గ్రుడ్డితండ్రి కఱ్ఱను చేతఁ గుదురఁబట్టి
చిప్ప మఱియొక చేతను జిక్కఁ బట్టి
'అమ్మ! కన్నులేని కబోది యమ్మ' యనుచు
పంచమ స్వర గళ మెత్తి బయల నార్చు.

# నెఱజాణ

౧

గడియ గడియకు వాకిలికడకు వచ్చి
కొప్పు సవరించి పైటను గూర్చి కూర్చి
వ్రేల్మడిచి వామనేత్రంబు ప్రీతి నిమిరి
ఓరగంటను జూచు నొయ్యారముగను.

౨

ఏదొ సందియ మున్నట్లు, లేమొ మఱచి
నట్లు, యోచనామగ్న యైనట్లు, చకిత
యట్లు, పరిచితి నూహించునట్లు, కాచి
కొన్నయట్లు, వలపు నేర్పుచున్న యట్లు.

౩

గోరు కొరుకును, గోటను గోరు గీరు
పెదవి నొక్కును, చూడ్కులు బెదరఁ జూచు
నొసలు ముడుచు, దెసలు చూచు, రసికత తెలి
య నునుసిగ్గుల ముసినవ్వు లంత గురియు.

# తొలిచూపు

మబ్బులోనుండి పొడిచిన మామయటుల
ముసుఁగు తెరలించి ననుగాంచె ముదిత యోర్తు
ధూమశకటవాతాయనోత్తుంగవీథి ;
భ్రమసి నిలచితి సుందరి వలపు దోచ.

మూగబాసలనేమేమొ ముచ్చటించె
కనులు, కన్బొమలు, నొసలు, గళము, చెక్కి-
ళులు, చిఱునగవునను మోవి-లలన యింత
పలుకు పలుకదు చక్కెర చిలుకవోలె.

మనము సౌందర్య వారాశి మగ్నమయ్యె
క్రొత్త బిడియము, సిగ్గు నన్నొత్తిపట్టఁ
గాంక్షలూరంగ నిలచితి, కలికి నోర్తు
పలుకరించెను మాపాలి వలపు త్రెయ్య.

కడచె మాపుణ్యకాలంబు కన్నుగిల్పి
చీరునంతకు, హొయలాడి జారుకొనియె :
అహహ ! తొలిచూపు భావ రహస్య ఫణితి
పాంథుఁ డెఱుఁగు, నెఱుంగునే పాంథవితతి.

# తుమ్మెద కబురు

౧

వచ్చిరాని మీసంబుల వలపుకాఁడు
వచ్చునో ! రాడొ: యేనాఁటి యుచ్చుగానెనొ,
మచ్చుమాయల నెఱుఁగని సచ్చరితుఁడు
పలుకులోఁ బల్కు నెఱుఁగనివాఁడె వాఁడు.

౨

తుమ్మెదా ! పోయిరావమ్మ తొంగితొంగి
యల్లనల్లన నరవిచ్చు మల్లెపొదల
నెల్ల వీక్షించి చిటికలోఁ దల్లడిల్లు
నన్ను విడిపోక యిచ్చోట నున్నయట్లు.

౩

మోముతామరకై వ్రాలి ముంగురులను
జిక్కువడ నిన్ను దీసి, ముద్దొక్క టిచ్చి,
నీ ప్రణయగాథ వినివిని నీరజస్థ
పతిని విడిపించె నాఁడు నావాఁడు కాదె !

౪

దారి తప్పెనో, వేఱొక తరుణిఁ జేరి
యదియ యేనని భ్రమసెనో ! యదియ వానిఁ
గౌఁగిట బిగించి విడువదో కావరమున
షట్పదీ ! పోయి విడిపించు ఝుంకరించి.

౫

గున్నమామిడిక్రిందఁ దానున్న యెడల
రాగమునఁ బాడు నాపేరు లాఘవముగ,
లేనిచో మామ వినెనేని లేనిపోని
పొఱపు లుదయించు నారాజు పొందుతప్పు.

మందాక్రాంతము

బాలా ! ప్రేమాబ్ధి మధురరసాస్వాదితానంద భృంగీ !
జాలం బేలే ? కుసుమశరుఁడీ చాడ్పు వేధించుచుండన్
ఏలా రాఁడే ? మృగధరుఁడు నన్నిట్లు బాధింపసాగన్
లేలే, సామిన్ వడిగ గొనిరా, లేద, ప్రాణాలె పోవున్.

## లోదీపి – వెలిదీపి

నిండునెల మోము, కన్నులు గండుమీలు
జుంటితేనియ పలుకులు, చంటి సొగసు
జక్కవకు నీడు, నయ్యారె! చాన వలపు
కప్పురపు జల్లు, నిలువెల్ల కమ్మఁదనమె.

## కౌఁగిలి

మలయ గంధపు సోనల జలకమాడి
మొగులు జడలను రిక్కల పూలు తురిమి
చిగురు టడుగుల మెల్లనఁ జేర వచ్చి
కౌఁగిలించెను చల్లఁగా గాలిపడుచు.

## సౌకుమార్యము

లేతదనమె విలువ, అది లేమ కొదవె
నేని మేలిమి నెత్తావి పూనినట్లు
చక్కఁదనము, రసజ్ఞత, చనువు, చదువుఁ
గలిగెనేఁ జెప్పవలయునే కలికి తీరు?

## సందేశము

పుష్పమా ! నీకు ముద్దులు పోహళించి
పూలహారముగా నొక్క లీలఁ గూర్తు,
ఎఱుఁగఁ దెల్పుము ననుగూర్చి యింతికడకుఁ
దరలి ; శిరమున నినుదాల్చి మురిసియాడు.

## చిఱునవ్వు

ఒక్క చిఱునవ్వు చాలదే యుజ్జ్వలాంగి !
మానస సరోవర విహార మానసాబ్జ
మధుర మకరంద బిందు సంభరిత ప్రణయ
వాతపోత చుంబన సుఖావాప్తి పొదల.

## ఇంగితము

కలికి ! కుల్కులఁ గుల్కుకీ కరణి కనుల
వలపుఁ బల్కులఁ జిల్కుకీ వరుసఁ జెవుల
మోహపుంజూపుతూపుల మోప కొడల
పయట సరిదిద్దు, వ్రాల్జడ వాల్చు మవల
మన తపంబులు వచ్చు జన్మాన పండు.

## అదృష్టము

కలికి యౌవన భాగ్యంబు కలిగినంత
పసిడికుండల నింపి, యాపైని నినుప
గుబ్బ తాళాలు బిగియించి, కుసుమబాణు
తలవరిగఁబెట్టి మకర కేతనము నెత్తె
ఎవనిచేఁ జిక్కు వాని పుట్టువు ఫలించు.

## రహః

రమణి సౌందర్య మింత మైఁబ్రామికొన్న
వెఱ్ఱిగంగెత్తి యువకులు వెంటఁజంద్రు ;
కలిమి గలిగిన లోభి ముంగిలిని గాచి
విసిగి సణగుచు యాచకుల్ వెళ్ళుచుంద్రు.

## పెద్దమనిషి

తనయింతి వెంట నుండినఁ
గననోపఁడు రంభవంటి కాంతయయ్యైనన్
తన నింత వెన్ను విడిచిన
తనువెల్లను కన్నులనఁగ తరుణుల వెదకున్.

## దమము

ఱాతి గుండైన కంపించు నాతినీడ
సోకినంతట, నింక నా సుదతి తాన
వలచి పైఁబడ కరగని వాఁడు కలఁడె ?
ఋష్యశృంగునికన్న గరిష్ఠుఁ డెవఁడు !

## జడకుచ్చులు

చేడె మ్రుగ్గిడ రొండిని చెరగు చెక్కి
వంగినంతటఁ గీల్జడ వ్రాలెఁ బాద
మునను, జడకుచ్చు లొదవె ముమ్మూర్తు లాపె
యడుగుదమ్ములఁ బడి మ్రొక్కు వడువు తోప.

## విటుఁడు

ఎపుడు ప్రేముడి ముద్దిచ్చు నెపుడు కూడు
నని నిరీక్షించు సతి వల పరయలేఁడు,
చిడిముడిని విదల్చి కసరి చిన్నపుచ్చు
స్వైరిణీ సంగతిని గోరు జడుఁడు విటుఁడు.

## దిటవు

జవ్వనము పొంగిపొరలెడు సకియకంచు
కంచువలె ధైర్య కవచంబు కాగి, సడలి,
మృదువయి, ప్రిదిలెఁ జిటుకున నింతివీక్ష
ణాశుగంబులు హృదయంబు నంటుచుండ.

## చులకన

ఇంటివైద్య మొకటి, యిల్లాలి సొగసొండు,
ఊరిలోని కవియు, నుచితమునకు
వచ్చినట్టి కాంత వలపును తమ కొన
గోటికైన సాటిగొనరు నరులు.

## చోద్యము

సకల పుష్ప వికాసి వసంత మెలసె
మాలతీవిముఖ యయి సమ్మదముతోడ,
జాతిహీన కేరీతిని సఖ్య మొదవు
సుమనసులతోడ ? నిదియెకా చోద్యమరయ !

## మాలపిల్ల

పంకమున నుండి వెలసిన పంకజంబు
విబుధజనశీర్షములపైని వెలయదొక్కొ !
మాలపిల్లయ యైన, రత్నాలమూట
యగుట నెవ్వని హృదయంబు హత్తుకొనదు ?

## ప్రణయిని

లత చిగిర్చిన యట్టు లా లలన వలపు
పల్లవించి, యాకుదొడిగి, ప్రాకి, యెదిగి,
కోరకం బిడి, పుష్పించి, క్రొత్తవాస
నలను గుమగుమాయించి నన్నలముకొనియె.

## ఉరోజములు

చువ్వలాటిపిల్ల నవ్వు మొగము సూచి
చందమామ తలను జార, శివుఁడు
లింగమయ్యు చిట్లి, రెండు వ్రక్కల దాని
పెన్నురంబు విడక పెనగులాడు.

## చక్షుః ప్రీతి

ఆస్యపద్మాన నేత్ర భృంగాళి వ్రాలి
క్రోలె తత్సౌమ్య రసము నకుంఠితముగ
కాని తనువంటి మఱల వక్కాలికి మేను
చర్మభస్త్రి కాదో, సుధాసరసి యేమొ !

## మధురభావము

ఏల పదివేల భామ లా లీల హరికి
మధురభావం బదొక్కటే మనసు దీర్చు ;
మింటిచుక్కలు పదివేలు మిటకరింపఁ
దనియునే నిశి చందురుం దగులుకొనక.

## ఉద్దీపనము

కర్షకునకు చల్ది, కార్మికునకు బ్రాంది
నాతికి సరసంబు, నరునకు మతి
కరణమునకు చుట్ట, కవికి కమ్మని జోడు
లేకయున్న వారు లేనియట్లె.

# నిర్వేదము

తనులతా పేశలత్వము గాంచఁగారాఁడు
గంధవహుండు విగ్రహము దాల్చి
చుంబింపఁగారాఁడు సూన ప్రపూర్ణామ్ర
తంబు తుమ్మెదతేఁడు తగవుమాలి
ముదిత లతాకుంజ పుంజంబులైనను
చెలిమికోరఁగరావు చెఱకు వెఱచి
కవి కుమారుండైనఁ గానంగరాఁడు నా
భావాలు తలపోసి పరితపింప
పంజరస్థ శుకాంగన భాతి నేడు
అడవిపాలయ్యె జీవితం బక్కటకట !
మన మెరియు "నసూర్యంపశ్య" మాట వినిన,
వెన్నెలన నేమొ యెఱుఁగునే కన్నుదోయి!

(A plant in the drawing room.)

# అన్యాపదేశములు

౧

కవులకుం బునర్జన్మంబు కలుగునేని
అగ్రజన్మత పీడి నే నవతరించి
నీదు కోర్కెలు దీర్చెద నిశ్చయముగ
తాళుమింక లసత్కవితా లతాంగి!

౨

ముందు పుట్టిన చెవులని మురిసె దేల?
వెనుక పొడిచిన కొమ్ములఁ గనఁగలేవు
పోని, ప్రత్యర్థిగుండియల్ పొడుచువేళ
ధణధణ మ్మను శృంగ శబ్దంబు వినుము.

౩

చాటుకోఁదగ్గ కథలు నీ జన్మమునకు
లేమి వారిని వీరి నీ లీల నేల
వక్రమార్గానఁ జూపెదు? పాపజాతి
లక్షణంబు రంధ్రాన్వేషణక్షమంబె.

# రెండుమాటలు

౧

వ్రేలిడి చూపఁగా నెవఁడు
　　　　వీరుఁడు మత్కవితా కుమారికన్
లీలను హావభావముల లేజివురాకుల
　　　　నేలు భామ ; మీ
సాలను ద్రిప్పి చెప్పెదను ;
　　　　చాలరు కాకవులేమి కూసినన్
పోలునె కొంగ యెంతయిన
　　　　పొల్పగు హంసపదంబు నేర్వఁగన్.

౨

కవులు పండితు లెందరో కలరు ఘనులు
కాంచనోపరు వారల ఘనత నొరులు
భ్రమరి క్రోలెడి పుష్పమరంద రుచిని
గరిక మేసెడి గాడిదల్ కాంచఁగలవె !

★

